# దశమ భాగము

All the tithe of the land whether seed of the land or of the fruit of the tree is the Lord's: it is holy unto the Lord.

భూధాన్యములలోనేమి, వృక్ష ఫలములలోనేమి, భూ ఫలము లన్నిటిలో దశమభాగము యెహోవా సొమ్ము. అది యెహోవాకు ప్రతిష్ఠితమగును.

(లేవీకాండము 27 : 30)

"నా సన్నిధిని ఎవడును వట్టిచేతులతో కనబడకూడదు"

(నిర్గమ 23 : 15)




రచయిత:

రెవ. ఐ. జాన్


1960

 వెల రు. 0-2-0

# ఉపోద్ఘాతము

క్రీస్తునందు, సోదర, సోదరీయులారా!

"నీ రాబడి యంతటిలో ప్రథమఫలమును నీయాస్తిలో భాగము నిచ్చి, యెహోవాను ఘనపర్చుము. అప్పుడు నీ కొట్లలో ధాన్యము సమృద్ధిగానుండును. నీ గానుగలోనుండి, క్రొత్త ద్రాక్షారసము పైకి పొరలి పారును. (సామెతె 3 : 9-10) అని సర్వశక్తిమంతుడైన దేవుడిచ్చిన యాజ్ఞను, అనేకమంది నెరవేర్చి, దానికి ఫలితముగా పొందనైయున్న ఆశీర్వాదములు పొందలేకపోవుటచూచి - యేసుప్రభువు నాకిచ్చిన స్వల్పజ్ఞానము నుపయోగించి - దశమ భాగమును గూర్చి, దైవగ్రంథములో దేవుడు బయలుపర్చిన వాక్యములు అనేకములను వెదకి, దశమ భాగము అనే పుస్తకమును వ్రాయ గలిగితిని.

ఈ పుస్తకమును అచ్చొత్తించుటకు కొంత సహాయ పడిన, ఇండియన్ క్రిష్టియన్ క్రూసేడ్ మిషనేరీ యగు రెవ. సిహెచ్. డి. పుష్పనాథము, బి. డి. అయ్యగార్కి నేనెంతయో వందనస్థుడను.

వందనములతో మీ సోదరుడు,

రెవ. ఐ. జాన్,

నిడమానూరు పోష్టు,

(కృష్ణా జిల్లా.)

# దశమ భాగము

భూధాన్యములలోనేమి, వృక్షఫలములనేమి భూఫలము లన్నిటిలో, దశమభాగము యెహోవా సొమ్ము. అది యెహోవాకు ప్రతిష్ఠితమగును. లేవి 27:30. మానవుడు సంపాదించిన ఆస్తి యంతటిలో దేవుని కిచ్చుట అనే భావము ప్రపంచోత్పత్తి సమయములోనే ప్రారంభమాయెను. ఉద - కయీన్యాను, హేబేలు. హేబేలు భూఫలములలో ప్రథమ ఫలములను, అనగా గొర్రెలమందలో తొలిచూలిపిల్లను దేవునికి సమర్పించి నట్లు, దైవగ్రంథమందు నిరూపణగలదు. (ఆది 4:2-4)

అబ్రహాము కాలములో సర్వోన్నతుడైన దేవుని యాజకుడగు మెల్కీసెదెకు, అబ్రహామును దీవించినందుకై, అబ్రహాము ఆయనకు దశమభాగము ప్రతిష్ఠించెను. దశమ భాగమునుగూర్చి, దైవగ్రంథములో ప్రథమముగా యిక్కడనే చెప్పబడియుండెను. మోషేద్వారా వ్రాయబడిన ధర్మ శాస్త్రమునకు పూర్వమే దైవభక్తిగల ప్రజలందరును, దశమ భాగమును సమర్పించుచుండిరి. (ఆది 14:20 హెబ్రి 7:4)

ఇశ్రాయేలీయులు దైవజనుడైన మోషే నాయకత్వము క్రిందనున్నప్పుడు, ఇశ్రాయేలీయులకు కలిగిన సమస్తములో నుండి, దేవునికి తమ దశమభాగమును చెల్లించవలసినదిగా దేవునిచే మోషేద్వారా ఆజ్ఞాపించబడిరి. (లేవి 27:30-34) కొంతకాలమువరకు, ఇశ్రాయేలీయులు, తమ దశమభాగమును దేవునికి చెల్లించుటలో, విడువక నెరవేర్చిరి. కాని, నాను

లోకాంఛలలో చిక్కి, దేవునికి తమ దశమభాగమును చెల్లించుట మరచిపోగా, దయాపూర్ణుడైన, పరమతండ్రి తిరుగ తన ప్రవక్తయగు మలాకీద్వారా, దశమభాగమునుగూర్చి జ్ఞాపకము చేయుచున్నాడు: "నా మందిరములో ఆహార ముండునట్లు, దశమభాగమంతయు, నా మందిరపు నిధిలోనికి తీసికొనిరండి, దీనిచేసి, మీరు నన్ను శోధించినయెడల, ఆకాశపు వాకిండ్లను విప్పి పట్టజాలనంత విస్తారముగా దీవెనలు క్రుమ్మరించెదను" (మలాకీ 3:10) దైవాజ్ఞానుసారముగా చెల్లించనిచో, శాపగ్రస్తులైయున్నారని, దేవుడు తన ప్రవక్తయగు మలాకీ ద్వారా తిరుగ హెచ్చరించుచున్నాడు. దేవు డిచ్చు యాజ్ఞను నెరవేర్చకుండా, ఆయన మనకు యివ్వబోవు ఆశీర్వాదములు పొందలేము.

తమ రాబడియంతటిలో దశమభాగమును చెల్లించువారు, పొందు ఫలితములు యీ క్రిందివిధముగానుండును.

1. భూములు కలిగి, పండించువారి పంటలు, తినివేయు పురుగులను గద్దించి, పుష్కలముగా పండునట్లు చేయుట.
2. ఆకాశపువాకిండ్లను విప్పి, పట్టజాలనంత విస్తారముగా దీవెనలను క్రుమ్మరించుట.
3. కుటుంబమంతటిని, పస్తులేకుండా పోషించుట.
4. ఇతరులను యాచించనవసరములేకుండా అవసరము లన్నిటిని యనుగ్రహించుట మొదలగునవి. సింహపు పిల్లలు లేమి గలవై ఆకలిగొనును గాని యెహోవా నాశ్రయించువారికి

ఏ మేలును కొదువయై యుండదు. (కీర్తనలు 34:10) అని సర్వశక్తిమంతుడగు యెహోవా శెలవిచ్చుచున్నాడు.

యెహోవా మాటలు జాగ్రత్తగా వినినయెడల మీలో బీదలు వుండనే వుండరు. ద్వితీయోప 15:5) గాన నీవును నీ కుటుంబమును పేదరికము లేకుండా ఆశీర్వాదకరముగానుండ వలయునని కోరినచో, ప్రభువు మన కిచ్చిన సూత్రమును, అనగా, మన రాబడి యంతటిలో, పదియవభాగము చెల్లించు టయే యని గ్రహించవలసియున్నది. దీనిచేసి మన పేదరిక మును పోగొట్టుకొందుముగాక !

1. "నైవేద్యములను తీసికొని ఆయన ఆవరణములోనికి రండి. (కీర్తన 96:8)
2. "నా సన్నిధిని ఎవడును వట్టిచేతులతో కనబడకూడదు." (నిర్గమ 23:15, 34:20)
3. వారు వట్టిచేతులతో యెహోవా సన్నిధిని కనబడక నీ దేవు డైన యెహోవా, నీ కనుగ్రహించిన దీవెన చొప్పున ప్రతి వాడును తన శక్తికొలది ఇవ్వవలెను. (ద్వితి. 16:17)

ఇన్నివిధములుగా దేవుడు తనను ప్రేమించు తన బిడ్డల కాజ్ఞాపించుచుండగా, దేవుని నారాధించుటకై దేవాలయము నకు [illegible] అనేకమంది క్రైస్తవులు వట్టిచేతులతో ఆరాధనకు వెళ్ళు[illegible]చు కలదు, అట్టి వారు దేవునికి యిచ్చుట విషయ ము[illegible] దేవుని యాజ్ఞను మీరి, ఆహారమునకు వెలితికలిగి యుం[illegible] దేవుని వాగ్దానమును తృణీకరించుటయేగదా !

హగ్గయి 2:8 వ లో, "వెండి నాది, బంగారం నాది" యని, సర్వశక్తిమంతుడగు దేవుడు చెప్పుచుండగా, ఆయన మన వద్దనుండి కోరుచున్న, దశమభాగమును ఆయన కిచ్చి, ఆయన దగ్గరనున్న, వెండి, బంగారమును పొందువారలమై జీవించుట యుక్తము కాదా! "నన్ను ప్రేమించువారిని ఆస్తికర్తలనుగా చేయుదును, వారి నిధులను నింపుదును" (సామెతె 8:21) నన్ను ప్రేమించుట యనగా – ఆయన ఇష్టము నెరవేర్చువారిని ఆస్తికర్తలనుగా చేయుదునని, సర్వశక్తిమంతుడు దేవుడు వాగ్దత్తమిచ్చియుండగా, ఆయనకు చెల్లింపవలసిన దశమభాగము, ఆయనకు చెల్లించి, కొంత ఆస్తికర్తలై, ఆహారమునకు కొదువలేకుండ జీవించి, జీవితాంతమందు, స్వర్గరాజ్యములో ప్రవేశించి, ఆనందించుట శ్రేయస్కరము కాదా!

పై నుదహరించిన వాగ్దత్తములు వెల్లడియగుటకోసమే, ఇశ్రాయేలీయులు, తమ ప్రథమఫలములైన, ధాన్య, ద్రాక్షా రసములను, నూనె, తేనె, సస్యఫలములను, విస్తారముగ దేవాలయమునకు తీసికొనివచ్చిరి. ఈలాగున వారు తమ పదియవ భాగమును దేవునికి చెల్లించుటచేత, విస్తారమైన ఆశీర్వాదములను పొంది బహుగా ఫలించిరి. సర్వశక్తిమంతుడైన దేవుని ప్రజలమైన మనమును, ఇశ్రాయేలీయులవలె బాగుగా ఫలించి ఆశీర్వదింపబడవలయునంటే వారివలెనే, మనము దేవుని కిచ్చి సచో ఫలించెదము గదా!

ఆయన కిచ్చుట విషయములో, తన సేవకుల ద్వారా బయలుపర్చిన విధానములను చూచెదము.

1. <u>సొలోమోను ద్వారా బయలుపర్చిన విషయములు :</u>

నీ రాబడి యంతటిలో ప్రథమ ఫలమును, నీ యాస్థిలో భాగము నిచ్చి యెహోవాను ఘనపర్చుము. అప్పుడు నీ కొట్లలోని ధాన్యమును సమృద్ధిగా పండును. నీ గాను గలలోనుండి క్రొత్త ద్రాక్షారసమును పైకి పొరలిపారును. (సామెతె 3:9-10)

2. "వెదజల్లి అభివృద్ధిపొందువారు గలరు. తగినదానికన్న తక్కువ యిచ్చి లేమి కిచ్చువారు గలరు." (సామెతె11:24)

2. <u>హిజ్కియాద్వారా బయలుపర్చిన విషయములు :—</u>

యెహోవా మందిరములోనికి జనులు కానుకలు తెచ్చుట మొదలుపెట్టినప్పటినుండి, నేము సమృద్ధిగా భోజనము చేసినను చాల మిగులుచున్నది. యెహోవా తన జనులను ఆశీర్వదించినందువలన యింత గొప్పరాసి మిగిలినదని రాజుతో ననగా (2 దినవృత్తా 31:10)

3. మలాకీ ద్వారా బయలుపర్చిన విషయములు :—

నా మందిరములో ఆహారముండునట్లు దశమభాగ మంతయు నా మందిరపు నిధిలోనికి తీసికొనిరండి దీనిచేసి మీరు నన్ను శోధించినయెడల నేను ఆకాశపువాకిండ్లను విప్పి పట్టజాలనంత విస్తారముగా దీవెనలు కుమ్మరించెదనని, సైన్యములకధిపతి యగు యెహోవా సెలవిచ్చుచున్నాడు. (మలాకీ 3:10)

4. అపొ. పౌలు ద్వారా బయలుపర్చిన విషయములు :—

(1) "కొంచెముగా విత్తువాడు కొంచెముగా పంట కోయును. సమృద్ధిగా విత్తువాడు సమృద్ధిగా పంట కోయును"

సణుగుకొనకను బలవంతముగాకాకను ప్రతివాడును తన హృదయములో నిశ్చయించుకొనిన ప్రకారము ఇయ్యవలెను. దేవుడు ఉత్సాహముగా నిచ్చువానిని ప్రేమించును". (2 కొరింథి 9:6–7)

(2) మరియు అన్నిటియందును ఎల్లప్పుడు మీలో మీరు సమృద్ధిగలవారై, ఉత్తమమైన ప్రతికార్యమును చేయుటకు దేవుడు మీయెడల సమస్తవిధములైన కృపను విస్తరింపజేయగలడు. ఇందు విషయమై, "అతడు, వెదజల్లి దరిద్రుల కిచ్చెను. అతని నీతి నిరంతరము నిలుచును." (2 కొరింథి 9:8–9)

(3) వివేకహృదయులందరు తమంతట తామే సామర్థ్యము కొలది దేవుని కివ్వవలయును. (2 కొరింథి 8:4)

(4) స్థిరమైన మనస్సుతో యివ్వవలయును.
(2 కొరింథి 8:11)

(5) ప్రతిఒక్కొక్కరు యివ్వవలయును. (2 కొరింథి 8:13)

ఈ పై విషయములన్నియు, దేవుని కివ్వవలసిన విధానములని ఎత్తి చూపించుచున్నాడు.

చందాకు లేక దాతృత్వమునకు – కృప – యని పేర్లు పెట్టుచున్నాడు. కృపయనుమాట లేక చందా యనే మాటలు 5 సార్లు నుచ్చరింపబడియున్నవి. (2 కొరింథి 8:9)

కృప - ఎవరికిని కీడు కలుగకుండా కురియు వర్షము లాంటిది అన్నాడు - కృప - రెండు పనులు చేయును - ఇచ్చు వారికి ఇవ్వబడును - పుచ్చుకొనేవారికి ఆశీర్వాదకరముగా నుండును. అని చెప్పినాడు.

పౌలు, యిచ్చుట విషయములో, రెండు సంఘములను గూర్చి చెప్పుచున్నాడు.

1. మకుదోనియ సంఘము :

కృప - విషయములో వారు, వారి సామర్థ్యము కంటె ఎక్కువగా నిచ్చి దేవుని యాశీర్వాదమును ఎక్కువగా పొందియున్నారని చెప్పియున్నాడు. (2 కొరింథి 8:2-4 7-11) ఇంకను వారిని హెచ్చరించుచు, నిండుగా కూర్చు కొనినవారికి, ఎక్కువ మిగులలేదనియు, కొంచెముగా కూర్చుకొనినవానికి తక్కువకాలేదనియు చెప్పెను.

2. కొరింథి సంఘమును గూర్చి :

ఈ సంఘము, మకుదోనియ సంఘముకంటె ధనికులుగా నున్నారు. గాని దాతృత్వము ఎక్కువగా లేనందున దేవుని కృపయును, ఆశీర్వాదమును పోగొట్టుకొన్నారని చెప్పెను - చందా - విత్తనములాంటిది. లేక విత్తనముల సంచిలాంటిది. (2 కొరింథి 9:10) అనగా విత్తనములు చల్లితేనేగాని పంటలు పండవు. గాన సంఘసేవ ఫలించవలయునంటే చందా యనే విత్తనములు జల్లుము. అప్పుడే పంటయొక్క ఫలితమును చూడగలము.

చందా లేక కానుక, భక్తిసూచకమైనది. గాన భక్తి గల క్రైస్తవులందరు చందా యిచ్చుటకు వెనుకదీయరు. భక్తిలేని జీవితము జీవించుచు, ఆరాధనకు వచ్చువారు చందా లిచ్చుటలో వెనుకదీయుదురు. గనుక వారికి వచ్చు ఆశీర్వాదములు పోగొట్టుకొందురు.

## కల్వరి సంఘ రిపోర్టు.

క్రైస్తవ పిల్లలందరు వారి వారి తల్లిదండ్రులు, వారి బిడ్డలకు యేమైనను అనగా నయాపైసగాని, అణాగాని, బేడ గాని యిచ్చినచో, వాటిని సిగరెట్లు కొనుటకుగాని, బీడీలకొనుటకు గాని, వృధాగా ఖర్చుపెట్టక, ప్రభువుకొరకు కానుకగా సమర్పించే వాడుక కలదని తెలియబడుచున్నది. All God's plan's and purposes are hidden in the scripture దేవునియొక్క ఏర్పాట్లును, ఆయన ఉద్దేశ్యములును, దైవ గ్రంథములో గుప్తపర్చబడియున్నవి.

1. To believe them is to believe God = వాటిని నమ్ముటయే, దేవుని నమ్ముట యనబడును.
2. To know them is to know God = వాటిని తెలిసికొనుటయే, దేవుని తెలిసికొనుట.
3. To understand them is to understand God = వాటిని గ్రహించుటయే దేవుని గ్రహించుట.
4. To love them is to love God = వాటిని ప్రేమించుటయే దేవుని ప్రేమించుట.
5. To meditate upon them is to think upon God = వాటిని ధ్యానించుటయే దేవుని జ్ఞాపకము చేసికొనుట.

6. To appropreate their promises is to appropreate God.
7. To measure up to God's man Christ, to be like them is to be like Him.

చందా లిచ్చువారి వుద్దేశ్యము లెట్లుండునో యీ క్రింది విధముగా తెలియపర్చబడుచున్నవి :-

1. The careless way = నిర్లక్ష్యముగా నిచ్చుట
2. The impulsive way = ఉద్రేకముతో నిచ్చుట
3. The industrious way = కష్టార్జితములోనుండి ఇచ్చుట
4. The self denying way = స్వార్థత్యాగముతో నిచ్చుట
5. The systematic way = క్రమముగా నిచ్చుట
6. The equal way = తన ఇంటిలో ఎంత ఖర్చు యగునో అంతయు నిచ్చుట
7. The Heroic way = తనకు తక్కువ దేవునికి ఎక్కువ యిచ్చుట (విలియంకేరీ)

వెదజల్లి అభివృద్ధిపొందువారు కలరు. తగినదానికన్న తక్కువ యిచ్చి లేమికి వచ్చువారు గలరు. (సామెతె 11:24)

క్రైస్తవులలో అనేకమంది తనకు వచ్చు రాబడి యంతటిలోనుండి పదియవ భాగము చెల్లించుటకు బదులుగా యివ్వవలసినంత యివ్వకుండుటయును కొంతమంది ఏమియు చందా యివ్వకుండుటయు, వచ్చిన రాబడి యంతయు తమ ఇష్టానుసారముగా స్వంతమునకే ఖర్చుపెట్టుకొనుటయును గలదు. అట్టివారికి తెలియనిరీతిగా కలిగే నష్టములు యీ క్రింది విధముగా నుండుటయును తటస్థించును :

జబ్బుపడి ఆసుపత్రిలో నెలలకొలదిగానుండి బిల్లులు కట్టుటయును,

2. పాడిపంటలలో నష్టపడుటయును,

3. వారు సంపాదించిన ఆస్తులు దొంగిలించబడుటయు,

4. వారియొక్క ఇండ్లు అగ్నిపాలగుటయును,

5. పెట్టెలలో పెట్టబడిన ప్రశస్తమైన వస్త్రములను చిమ్మట గొట్టుటయును, మనము కండ్లార చూచుచున్నాముగదా! ఇవన్నియు దేవుని కివ్వవలసిన పదియవభాగమును యివ్వ కుండుటవలన కలిగే నష్టములు కావా – నీవు పదియవ వంతు క్రమముగా నిచ్చి, ఆయన యాశ్చర్య నిత్య జయజీవితమును జీవించుట శ్రేయస్కరము కాదా!

దేవునికి పదియవ వంతు యిచ్చుటలో, నా యనుభవ మును వివరించెదను –

నా రాబడి యంతటిలో పదియవవంతు దేవుని కిచ్చుటకు బదులుగా, ఆయనకు బహుతక్కువగా నిచ్చి, మిగిలినది నా స్వంతమునకే వాడుకొనుచుంటిని. దానికి ఫలితముగా, నా రైలు ప్రయాణములో రు 5:3-4-0 పోగొట్టుకొంటిని, అప్పటినుండి, బుద్ధితెచ్చుకొని, ప్రభువునకు నా పదియవ వంతు క్రమముగా నివ్వకుండుటచే, నాకు కలిగిన నష్టము న్యాయమే యని తలంచి, ప్రభువు దగ్గర క్షమాపణ యడిగి, క్రమముగా నా పదియవ వంతు చెల్లించుచుంటిని. అప్పటినుండి ఏ తొందరయు లేకుండా జీవించుచుంటిని. ఆయనకు చెల్లించవలసిన పదియవ వంతు చెల్లించకపోయినయెడల ఆయనవలన పొంద

బోవు ఆశీర్వాదములను పోగొట్టుకొందుము - ఇక్కడి క్రై కిన్వాబమునకు, దేవుని వాగ్దత్తమును నమ్మి, ఆయనకు మన పదియవవంతు లెక్కచూచి చెల్లించినచో యేకొరతయునులేని జీవితము జీవించెదమని దృఢనిశ్చయత కలిగియుందుముగాక !

సృష్టికర్తయైన దేవునికి, సృష్టియైన మానవుడు ఇచ్చుటలో బద్ధుడైయున్నాడు. మరియు, దేవుడు సృష్టికర్తమాత్రమే గాక, మానవ యక్కరలను దీర్చుటకు సమస్తమును యిచ్చువాడై యున్నాడు.

రోమా చక్రవర్తికి పన్ను యిచ్చుట సరియా కాదా యని యేసుప్రభువుని యడుగగా ఆయన చెప్పినదేమంటే "కైసరువి. కైసరుకును, దేవునివి దేవునికిని యివ్వండి" అని చెప్పెను. గాన దేవునికి, మన దశమభాగము చెల్లించుటలో అర్థమున్నది. మనకు కొంత భూమియుండగా, దానిని యను భవించుచు, ప్రభుత్వమువారికి చెల్లించవలసినది ఎట్లు చెల్లించుచున్నామో అలాగే సృష్టి యావత్తు దేవునదే గనుక ఆయనకు చెల్లించవలసిన భాగము ఆయనకు చెల్లించవలసియున్నది. అనగా దేవునికోరెక ప్రకారము పదియవవంతు దేవునికి చెల్లించ వలయునుగదా !

కీర్తనలు : 50:10-12 లో, అడవిమృగము లన్నియు వేయికొండలమీద పశువు లన్నియు నావేగదా" అని దేవుడు తెలియచేయుచున్నాడు - "దేవుడైన యెహోవా మీ కనుగ్రహించిన శక్తికొలది యివ్వవలెను - (ద్వితి. 16:15-17) నీ దేవుడైన యెహోవాను జ్ఞాపకము చేసికొనవలెను. ఏల

యనగా, తాను నీ పితరులతో ప్రమాణము చేసినట్లు తన నిబంధనను, నేటివలె స్థాపించవలెనని మీరు భాగ్యము సంపాదించుకొనుటకై మీకు సామర్థ్యము కలుగజేయువాడు ఆయనే - (ద్వితియో 8:18)

ఒకడు తన సొమ్మును వాడుకొనే విషయములో సవస్మ్రకముగా నుండినయెడల అట్టివాడు దైవసహాయమును అనుభవించి తన జీవితమును - నీతియందును, పరిశుద్ధతయందును, తన సమాధానమునందును, సంతోషమందును వృద్ధిపొందించుకొనును. ఒకడు తన స్వంత సొమ్ము విషయములోగాని, ఇతరుల సొమ్ము విషయములోగాని, సక్రమముగా లేనపోయిన యెడల, వాడు నిజమైన ధనము విషయములో పేదవాడు, నిత్యము తా ననుభవించవలసిన భాగ్యము విషయమై తప్పక పోగొట్టుకొనును. తన రాబడిని దుర్వినియోగపర్చువాడు, తన కీర్తిని, శీలమును చివరకు తన ఆత్మీయజీవితమును గూడ నశింపజేసికొందురు. ధనాపేక్షయను దుర్గుణమును మన హృదయములోనికి, మన ఆత్మలలోనికి రాకబడకుండునట్లు చేయవలయునని, మన ప్రభువు చెప్పినమాట స్పష్టమే - దానిని నెరవేర్చుటకు ఒకటే సూత్రము గలదు. అది యేదనగా దేవుని రాజ్యసంబంధమైన పనులకొరకు, తన పదియవవంతు చెల్లించుటయే. మనుష్యుని ఆత్మలో దేవునివాక్యముయొక్క శక్తిని అడ్డగించు శక్తులలో ఒకటి ధనాపేక్షయే - పేదవారికి తమ యిబ్బందులను గూర్చిన చింతయు, ధనవంతులకు ధనాపేక్షమున కలుగు ఆవేదనయును ఏకభావముగలవే.

యోహాను 12:4-6 లో యూదా ఇస్కరియోతుయొక్క చరితమును చూచినయెడల, ఇస్కరియోతు యూదా ఎందుకు తప్పిపోయెనో దాని యంతరార్థము కనబడుచున్నది. శిష్యుల అందరియొక్క సొమ్మును తన స్వంత ఖర్చులకొరకు వాడు కొనుచుండేవాడు. సమాజపు సొమ్మును కూడ అపహరించు అభ్యాసమును విస్తరించినకొలది, కఠినహృదయుడై, ఘోర పాపియాయెను: (లూకా 12:15)

ఒకడు దేవునికి చందా యివ్వక పూర్వము తన్నుతాను దేవుని సమర్పించుకొనవలసిన విధియైయున్నది. దేవునికి తను పదియవ వంతు ఇచ్చు విషయములో క్రైస్తవుడు అభివృద్ధి పొందువరకు నాని జీవితములో ఏదో యొక కొరతయున్నట్లు చెప్పగలము. దేవునికి ధారాళముగా తన ధనమును యివ్వక పోయినచో, అతనిలోని పశ్చాత్తాపము - మార్పు - విశ్వాసము, ప్రేమ మొదలగు గుణము లన్నియు అసంపూర్ణములు గానే యుండును. ఆరాధనమునకు క్రమముగా హాజరగుటయు, ఆదివారమును పరిశుద్ధదినముగా ఆచరించుటయును ప్రభు రాత్రి భోజన సంస్కారములో పాలుగొనుటయును క్రైస్తవు లందరును చేయవలసిన విధియేగదా! అదేవిధముగా దాతృత్వము యందు కూడా క్రైస్తవులు ఆసక్తిగలిగియుండుట వారియొక్క విధియేగదా! మనము భూలోకపు ఆస్థిని ఇతరులకు యిచ్చినందుకు మనకు కలుగు ప్రతిఫలము బహుశ్రేష్టమైనదని తలంచవలయును. ఈ లోకసంబంధమైన యీావులు ఇతరులకు పంచి యిచ్చుట ఆత్మీయరీతిగా దీవెనలు పొందుటయేనని, నిరీక్షించ

వలసియున్నది. దేవునికి మీరు ఇచ్చినయెడల మీకు ప్రతిఫలము వచ్చునని పాతనిబంధనకాలములో ప్రవక్తలును యాజకులును, ఇశ్రాయేలీయులకు బోధించిరి. సామెతె 19:17 లో "బీదలను కనికరించువాడు యెహోవాకు అప్పు ఇచ్చువాడు గాని యుపకారమునకు ప్రత్యుపకారము చేయును" అని వ్రాయబడియున్నది "నీ దేవుడైన ప్రభువు నీ చేతుల పని యంతటిలో నిన్ను దీవించులాగున నీవు బీదలకు యివ్వవలెను" అని చెప్పుచున్నాడు. "అతడు వెదజల్లి దరిద్రులకు ఇచ్చెను. అతని నీతి నిరంతరము నిలుచును" విత్తువానికి విత్తనమును భుజించుటకు ఆహారమును దయచేయు దేవుడు మీకు విత్తనము దయచేసి విస్తరింపజేసి మీరు ప్రతి విషయములో పూర్ణౌదార్యము గలవారగునట్లు మీ నీతిఫలములను వృద్ధిపొందించును. (2 కొరింథి 9:9-10) ఒకడు ఔదార్యముగా ఇచ్చినందున కలుగు ఫలిత మేమనగా వాని జీవితము ఆశీర్వదింపబడి పెంపొందును. ఆయన మరి ఎక్కువగా ఇచ్చుటకు శక్తి పొందును. హెచ్చుగా కూర్చుకొనినవానికి ఎక్కువ మిగుల లేదనియు, తక్కువగా కూర్చుకొనినవానికి తక్కువకాలేదనియు లేఖనము చెప్పుచున్నది. (2 కొరింథి 8:14-15)

ఇశ్రాయేలీయుల కాలములో, దేవునికి అర్పించబడినది మూడు విధములుగా వినియోగింపబడియున్నది :—

1. దేవుని ఆరాధనకొరకు,

2. యాజకులయొక్కయు, లేవీయులయొక్క పోష[illegible]

3. బీదల పోషణకొరకును యిచ్చియుండిరి. ఈ విధముగా ఇవ్వబడినవన్నియు, దేవునికే ఇవ్వబడినట్లు భావింపబడెను. ఆరాధన స్థలములకొరకు మాత్రమేగాక, ఆరాధనలు జరుపుటకు ఖర్చులు కూడా ప్రజలే యిచ్చియుండిరి. నిర్గమ 30:36 లో చెప్పబడినట్లు, దేవాలయములో వెలిగించుటకు నూనెయు, పరిశుద్ధ స్థలములో ధూపము వేయుటకై ధూప ద్రవ్యముల కూడా చెల్లించియుండిరి.

ఇశ్రాయేలీయుల పండ్రెండు గోత్రములలో పదకొండు నుందరికి మాత్రమే కానాను దేశములోని స్వాస్థ్యము పంచిపెట్టబడియుండెను. గాని, లేవిగోత్రమునకు స్వాస్థ్యము లేకయుండెను. సంఖ్యా 18:21-24 లో "ఇదిగో లేవీయులు చేయు సేవకు అనగా ప్రత్యక్షపు గుడారము యొక్క సేవకు నేను ఇశ్రాయేలీయులయొక్క పదియవభాగము లన్నిటిని వారికి స్వాస్థ్యముగా నిచ్చితిని" ఇశ్రాయేలీయుల మధ్యను వారికి స్వాస్థ్యమేమియు ఉండదు. ఇది మీ తరతరములకు నిత్యమైన కట్టడ" అని దేవునిచే వాగ్దత్తమియ్యబడెను. "యాజకులైన లేవీయులకు అనగా లేవిగోత్రములవారి కందరకును, ఇశ్రాయేలీయులతో పాలైనను స్వాస్థ్యమైనను లేదు. (ద్వితీయో 18:1-5) గాన యీ కాలములో క్రైస్తవులైనవారందరు ఇశ్రాయేలీయులుగాను, సంఘాధ్యక్షులను, లేవీయులుగాను, పోల్చవలసియున్నది. దైవపిలుపువల్ల పిలువబడి ప్రత్యేకించబడిన పాదిరీయులందరు యాజకులే. లేవీయులకు పారంపర్యాంతము, దేవాలయములో యాజకత్వము చేయుటకు ఒప్పగింపబడిన పని నేటికాలమందు

సంఘాధ్యక్షులకు అప్పగింపబడినట్లు మనము తప్పక గ్రహించవలసియున్నది.

ద్వితియో 14:27, 18:1-5 లో చెప్పబడినదేమనగా లేవీయులను విడువకూడదు - మీ మధ్యను వారికి పాలైనను స్వాస్థ్యమైనను లేదు. అని దేవుడే చెప్పెను. ఆ లేవీవంశమే - యీ కాలపు యాజకులనే సంఘాధ్యక్షులు.

ఇశ్రాయేలీయులయొక్క దశమభాగముతో లేవీవంశము వారిని పోషించినట్లు - యీ కాలములో క్రైస్తవులయొక్క దశమభాగముతో సంఘాధ్యక్షులను పోషించుట సంఘబాధ్యతయైయున్నది. ఇదియే దేవుని వుద్దేశ్యమైయున్నది. "దశమ భాగము లేవీయులకు స్వాస్థ్యముగా నిచ్చితిని. (సంఖ్యా 18:24)

దశమభాగము దేవునికి చెల్లించవలయుననే భావము. యేసుక్రీస్తు అవతారపురుషుడై వచ్చి యీ లోకములో నుండగా పై దానిని బలపర్చుచున్నాడు. ఆయన చెప్పిన దేమనగా "అయ్యో! పరిసయ్యులారా! మీరు పుదీన, సదాప మొదలైన ప్రతి కూరలలోను పదియవ వంతు చెల్లించుచున్నారేగాని, న్యాయమును దేవుని ప్రేమను, విడచిపెట్టుచున్నారు. వాటిని మానక వీటిని చేయవలసియున్నది. (లూకా 11:42 మత్తయి 23:23) దేవునికి ప్రతిష్టితములగు వారి దశమభాగములు దేవుని సన్నిధిలో నిత్యము జ్ఞాపకార్థముగా నుండును" అని బైబిలు ఘోషించుచున్నది. గాన, తమ రాబడి యంతటిలో, దేవుడు ఆజ్ఞాపించిన దశమభాగమును

చెల్లించినవారు ఆయన ఆశీర్వాదమునే వరమును పొంది ప్రవాహముగా పారుచున్న కాలువలుగా నున్నారు. దశమభాగముని యిచ్చుట ద్వారా తామొక ప్రాముఖ్యమైన దేవుని యాజ్ఞను నెరవేర్చుచున్నారు. "యెహోవానైన నేను మార్పులేని వాడను గనుక యాకోబు సంతతివారైన మీరు లయము కాలేదు" అని ఇశ్రాయేలీయులను గూర్చి దేవుడు వాగ్దత్తము చేసియున్నాడు. గాన మార్పులేని దేవునికి మనమును మన దశమభాగము సమర్పించి లయము గాకుందుముగాక !

"గుడిలేని గ్రామములో గుడిసె కట్టుకొనరాదు" అను సామెత ప్రకారము, ప్రతి గ్రామములోను, దేవాలయము బలముగా కట్టుకొని దేవుని ఆరాధనచేయుట క్రైస్తవ బాధ్యతయై యున్నది. (సంఖ్యా 18:12 లో) "వారు యెహోవాకు అర్పించుచారి ప్రథమఫలములను అనగా, నూనెలో ప్రశస్తమైన దంతయు, ద్రాక్షారస, ధాన్యములలో ప్రశస్తమైనదంతయు నీ కిచ్చితిని" అని యెహోవా, యాజకులైన అహరోను కుటుంబములో చెప్పుచున్నాడు.

నిర్గమ 23:19, 34:6 లో న్యాయశాస్త్రము యీ క్రింది విధముగా చెప్పుచున్నది. నీ భూమి ప్రథమఫలములలో మొదటివాటిని దేవుడైన యెహోవా మందిరమునకు తేవలయును.

లేవీ 7:13-16 లో నీ దేవుడైన యెహోవా నిన్ను ఆశీర్వదించినకొలది దాని నియ్యవలయునని వ్రాయబడి యున్నది. పాతనిబంధన చట్టప్రకారము, ఒక భక్తిగల ఇశ్రా

లేవీయుడు దేవునికి సమర్పించినది లెక్కచూడగా అతని రాబడి యంతటిలో మూడవవంతు వుండునని ఒకరు చెప్పు చున్నారు.

క్రీస్తు కృపాసంబంధమైన చట్టప్రకారము క్రైస్తవుడు యేసుక్రీస్తుద్వారా — దేవుడు చూపిన విస్తారమైన ప్రేమను బదిలుగా మనుష్యుడు స్వేచ్ఛార్పణలను ఆయనకు అర్పించవలయును అని తిరిగి తిరిగి జ్ఞాపకము చేయుచున్నది.

2 కొరింథ 8:3 లో, పరిశయ్యుడు తన రాబడి యంతటిలో పదియవ వంతు నిచ్చినట్లును (లూకా 18:12) జక్కయ్య తన రాబడిలో, సగము ఇచ్చినట్లును (లూకా 19:8) పేదవిధవరాలును, బన్నబాయును, తనకు కలిగినదంతయు నిచ్చినట్లును (లూకా 21:4 అపొ. కార్య 4:37) లో చదువు చున్నాము — తన రాబడిలో దేవునికి ఎక్కువగా నిచ్చినారు, ఈ అంశములను సరిగా గ్రహించియుండినట్లైతే, సిద్ధాంతముగా చెప్పవచ్చును. అట్టివారు తమ ఆత్మీయజీవితములో ఉన్నత స్థితిలోనుండినట్లుగా గ్రహించవచ్చును — కొరింథీయులోని సభ, దైవగ్రంథములో, బాగా తర్ఫీదునొంది, దానిలో బాగా పెంచబడియుండినట్లు, అన్ని సభలకంటె, నాడు దేవునికి ఎక్కువగా నిచ్చినట్లు అంచనా వేయబడియున్నది. దేవుని కిచ్చుట మన విధి గనుక, ఆయనకు యివ్వవలయుననియు, ఆలాగున యివ్వకపోయినయెడల మనము నేరస్థులమగుదు మనియు, గట్టిగా తెలిసికొనవలయును. భక్తిగల పురుషులును, స్త్రీలును తాము సంపాదించు సొమ్ములో ఏవిధముగా ఖర్చు

పెట్టుచున్నారో, సంవత్సరమునకు ఎంత సంపాదించుచున్నారో, సంవత్సరాంతపు ఆదాయముయొక్క వ్యయ, పట్టీలను తయారుచేసి, దీర్ఘముగా నాలోచించి, దేవుని కిచ్చుటలో, ఇంకా ఎంత సొమ్ము బకాయుపడియున్నారో చూచి, అది చెల్లించుటకై క్రైస్తవధర్మము బాధ్యతయైయున్నది.

పశ్చిమదేశములో రెండుభాగములు గల కవర్లద్వారా చందా ఇచ్చేయు పద్ధతి ప్రస్తుతకాలములో వాడుకలోనున్నది. నెలనెలకు పొందువారు, తమ సంఘముయొక్కయు, సంఘాభ్యాసముయొక్కయు పోషణార్థకు ఎంత యిచ్చుటకు కోరుదురో దానిని ఒక ప్రక్కను విదేశ సువార్త సేవకొరకు ఎంత యిచ్చుటకు ఇష్టపడుదురో దానిని రెండవ ప్రక్కను పెట్టెదరు. ఇదేవిధముగా రెండు అరలు గల ఒక పెట్టెను చేయించి, ఒక అరమీద సంఘముకొరకు, అను మాటను, రెండవ అర మీద, విదేశ సువార్త సేవకొరకు, అను మాటలు వ్రాసి, ఏపనికి ఎంత యిచ్చుట ఇష్టమున్నదో అంతయు దాచిపెట్టుకొనుము. వారపు చందా తీయుట విషయములో, మంచిపద్ధతి యేదనగా- కూలి విధాన్యరూపకముగా పొందువారును, ఇంటివారు భుజించుటకై స్వంతభూములలో ధాన్యము పండించువారును, ఆడవారు వంటచేయునప్పుడు ఒక పిడికెడు బియ్యము చందాగా తీసి, వేరుగా నుంచవచ్చును. దీనికొరకు, సంఘమే ప్రతి కుటుంబమునకు ఒక సంచి తయారుచేసి, దానిమీద శిలువ గుర్తువేసి సంఘస్థుల కిచ్చుట మంచిపద్ధతియైయున్నది. సంఘములోనున్న ప్రతి స్త్రీయును, ఈవిధముగా పిడికెడు బియ్య

మును దేవునిపేర తీసినయెడల, ఆదివారము వచ్చుసరికి అర్ధ శేరు బియ్యమగును. అనగా సంవత్సరమునకు 26 శేర్లు బియ్య మగును. రొక్కపూర్వకముగా చూచినచో రూ. 16-50 నయాపైసలగును. ఈ చొప్పున యిచ్చినచో సంఘపు అవసరతలు తేలికగా నెరవేరును. ఈ పైరీతిగా చేసినయెడల దైవాశీర్వాదము తప్పక పొందును.

తన రాబడియంతటిలో దేవునికి పదియవ వంతు ఇవ్వవలయునని, నిశ్చయించుకొనిన, ఒక దేశీయవైద్యుడు, తనకు డబ్బువచ్చినప్పుడెల్ల, తన రాబడిలో పదియవవంతు తీసి యొక మట్టిముంతలో వేయుచుండెను. ఆలాగు వేసి సంవత్సరము చివరను లెక్కచూడగా ఆ మట్టిపిడతలో రూ 28-0-0 వుండెను. అతడు ఎంతో ఆశ్చర్యముతో సంఘాధ్యక్షునకు ఒప్పగించెను. గాని అదివరకు అతడు మొత్తముమీద సంవత్సరమునకు రూ 2-0-0 మాత్రమే యిచ్చెడివాడు.

సిరియన్ సభలో పురాతనకాలమునుండి యొక అలవాటుండెను. అది యేదనగా, వివాహకాలములో ఇవ్వబడు కట్నములో, ఇరువదియవ భాగము దేవాలయపు నిధికిని, మరియొక ఇరువదియవభాగము దైవసేవకొరకును ఇచ్చువాడుకయుండెను. ఆంధ్రప్రదేశపు క్రైస్తవులు కూడా, తమ వివాహమునకు యగు ఖర్చులలోను, ఆ సమయమునకు వచ్చు ఓలి, కట్నము మొదలగువాటిలోనుండి పదియవ వంతు దైవ సేవకొరకు ప్రతిష్ఠించినయెడల సంఘసేవ అవలీలగా జరుగగలదు.

చీనాదేశములోని క్రైస్తవులు దేవుని కిచ్చు పద్ధతులు యీ క్రింది రీతిగా నుండును.

1. ఆదివారపు అర్పణలు,
2. సంవత్సరపు ఒప్పందములద్వారా వచ్చు అర్పణలు,
3. కొంతమంది కలసి మొత్తముగా యిచ్చు అర్పణలు: అనగా ఆదివారపు పాఠశాలలద్వారాను, ఇతర సమాజముల ద్వారాను, సభయొక్క ద్రవ్యనిధికి వచ్చు అర్పణలు,
4. కృతజ్ఞతార్పణలు - అనగా జననదినపు కానుకలు స్తోత్రార్పణలు మొదలగునవి,
5. పిల్లల అర్పణలు,
6. ఇతర దేశములకు వెళ్ళిపోయిన సభ్యులయొక్క కానుకలు - వారికి వ్రాసి రప్పించిన చందాలు,
7. భూఫలముల రాబడినుండి యిచ్చు అర్పణలు,
8. ప్రభువు యకరముల పద్ధతి, అనగా గుడి మాన్యమును, క్రైస్తవులే సాగుబడిచేసి దాని రాబడి యంతయు దైవ సేవకొరకు అర్పించుట,
9. రాబడిలో ప్రతి క్రైస్తవుని దశమభాగము నర్పించుట,
10. జంతువులు, పశువులు, కోళ్ళు మొదలగువాటిని పెంచి దేవాలయములోనికి తెచ్చి అర్పించు పద్ధతులు గలవు.

పిలిప్పైన్ద్వీపములోనున్న సభవారు ఇంకా కొన్ని పద్ధతులు అవలంభించియున్నారు :

1. సంఘపెద్దలు – ప్రతి పురుషునియొద్దకును, ప్రతి స్త్రీయొద్దకును, పిల్లలయొద్దకును వెళ్ళి, వారు దేవుని పని కొరకు ఎంత యిచ్చెదరో ఒప్పందము చేయించెదరు.

2. సంఘనాయకులు – అప్పుడప్పుడు, కూటములును, పాఠశాలలును పెట్టుకొని క్రైస్తవ దాతృత్వముయొక్క విధిని గూర్చి తర్కించుదురు.

3. క్రైస్తవ దాతృత్వమునుగూర్చి, దైవగ్రంథములోని విధులను, మూలసూత్రములను, యుపదేశించుటకై అప్పుడప్పుడు కొన్నికూటములు పెట్టుదురు.

4. క్రైస్తవ దాతృత్వముయొక్క విధిని తెలిసికొనుటకు సహాయార్థముగా పత్రికలను, పుస్తకములును కొన్ని పర్యాయములు పటములతోను ప్రచురించుచుందురు.

అపో. పౌలు చందా విషయములో తన సభల ప్రయోజనార్థముగా నిర్ణయించిన కొన్ని పద్ధతులను చూచెదము.

1. ప్రతి ఆదివారమును మీలో ప్రతివాడును తనయొద్ద కొంత సొమ్మును నిలువచేయవలెను.

2. ఎంత నిలువచేయవలసియున్నది ? తాను వర్ధిల్లినకొలదిని నిలువచేయవలయును.

3. ప్రతి సంఘమును తాము జమచేసిన ద్రవ్యమును తన ప్రతి నిధిచేతనే యెరూషలేములోని సంఘమునకు పంపించవలయు నని యాజ్ఞ యిచ్చెను.

4. ఆ ద్రవ్యమును యెరుషలేము సంఘమునకు తీసికొనివెళ్ళిన వారి పేర్లు కూడా వ్రాయబడియుండెను. గాన యీకాల ములో కూడా, సంఘములోనున్న గ్రామాదులనుండి సంఘమునకు పంపబడి, సంఘాధ్యక్షుల జీతమునకును, జీతముపోను మిగిలిన సొమ్మును సంఘ ఖజానాదారుని యొద్ద నిలువచేసి, సంఘావసరతలను తీర్చుకొనుట దేవుని యొక్క వుద్దేశ్యమునికూడా తెలిసికొనవలెనియున్నది.

ప్రజాపతియగు క్రీస్తు పరలోకమును విడచి, నరలోక మున కేతెంచి, ముప్పదిమూడున్నర సం॥ భూలోకములో నుండి ప్రజల పాపముల కొరకై బలిగా నర్పించుకొని, చని పోయి తిరిగి లేచి, పరలోకమునకు వెళ్లుటకు సిద్ధముగానుండి, ఆయన చివరగా యిచ్చిన ఆజ్ఞ యేమనగా "మీరు సర్వలోక మునకు వెళ్లి సర్వసృష్టికి నా సువార్తను ప్రకటించుడి" (మార్కు 16:15) అని చెప్పెను. ఈ చివరి ఆజ్ఞలో, దేశము, కులము, జాతి, రంగు, మతము అనే భేదములు లేవని తేలినది. ఇట్టి ప్రభువు యిచ్చిన చివరి యాజ్ఞను శిరసావహించి, ఇంగ్లాండు, అమెరికా, కనడా, జర్మని, ఫ్రాన్సు, ఇటలీ మొద లగు దేశములవారు, దేవుని యాజ్ఞ ప్రకారముగా - తమ యొక్క రాబడి యంతటిలో దశమభాగమును తీసి - ఇండియా, జపాన్, రష్యా, ఆఫ్రికా దేశములకును, ఇంకను అనాగరికతగల

చీకటి ప్రదేశములకును, మిషనేరీలను తాము పోగుచేసిన సొమ్ము నిచ్చి పంపించిరి. వారు వచ్చి, కొండకొప్పులమీద నున్న హీనజాతివారికి వెలుగుచూపించుటకై — విద్యకొరకు ఎలిమెంటరీ పాఠశాలలను, హైస్కూళ్ళను, కాలేజీలను స్థాపించి, విద్యనభ్యసింపజేసి, పై దేశాధికారులతో సమానంగా పెట్టిరి. విద్యనభ్యసించినవారిలో, కొందరు పాదిరులుగాను. సెమినేరీలను పెట్టించి షుమారు నూరు సంవత్సరములు ఆ సెమినేరీలను పోషించి స్వాతంత్ర్యపదేశము చేయుచుండిరి. ఇదంతయు పై దేశముల యొక్క పరోపకారము క్రీస్తు త్వము యొక్క ఫలితము కాదా! ఆ ఫలితమును పొందినవారే — క్రైస్తవ, సంస్థలలో పెరిగిన స్కూళ్ళలోను, హైస్కూళ్ళలోను, కాలేజీలలోను, ఆసుపత్రులలోను, గవర్న మెంటుకు సంబంధించిన అనేక కొన్ని శాఖలలోను సేవచేసి, గొప్పజీతములు పొంది వెలిగించబడి, విశ్వాసంతములుగా జీవించుచున్నారుగదా! అట్టివారు తాము ఇతర దేశములవారి దశమభాగములచే పోషింపబడిన దాని ఫలితముగా తమ దశమ భాగములు దేవునికిచ్చి కృతజ్ఞతగలవారై జీవించుట ఆశీర్వాద కరము కాదా!

1952–54 వరకు కృష్ణాజిల్లాలోని పుయ్యూరు ప్రాంత ములలో మిషనేరీగా సువార్త సేవచేసిన రెవ. జె. ఐ. రిచర్డుసన్ గారు నాతో చెప్పినదేమనగా "కెనడా దేశములో గవర్న మెంటు ఉద్యోగములలోనున్న క్రైస్తవులును, వ్యవసాయ దారులును, కూలివృత్తి చేయుచున్న సరికొందరును తమ తమ

పదియవ వంతుతో రూ 18,000 (పదునెనిమిది వేల రూపా యలతో) నావద్దనున్న యీ చక్కని కారు నాకు కొని యిచ్చి, మీరు యీ కారుమీద తిరిగి, ఇండియాదేశములో సువార్తసేవ చేయుమని నన్ను పంపించిరి. అని నాతో చెప్పెను. ఆహా! వారియొక్క దాతృత్వపు విధానము చూడగా, నా కెంతయో ఆనందము కలిగించినది.

ఈ పై విధానము చూడగా, కెనడాదేశములోనున్న వారు, వారు ఇండియాదేశమునకు వచ్చి సేవచేయలేకపోయి నను, తాము కొనియిచ్చిన కారు ద్వారా సేవచేయించుట కాదా!

"నీ వాక్యము వెల్లడియగుటతోడనే వెలుగుకలుగును అనే దైవవాక్యమును, ఇండియాదేశపు పేదవారిపట్ల నెరవేర్చ బడుట దైవాజ్ఞయొక్క నెరవేర్పుకాదా! "వెదజల్లి అభివృద్ధి పొందువారు గలరు. తగినదానికన్న తక్కువ యిచ్చి లేమికి వచ్చువారు గలరు." (సామెతె 11:24)

Go, or, send – నీవు వెళ్ళుము – వెళ్ళలేకపోయిన యెడల పంపించుము – అనగా సువార్త సేవచేయుటకు, నీవు ఉద్యోగములలో చిక్కుకొనిపోయి తీరుబడిలేకపోయినయెడల, నీయొక్క పదియవ వంతు యిచ్చి, సేవచేయించుము. అంతట

సేవకులుచేయుచున్నా సేవలో, నీవును ఫలితమును పొందుదువు. నీవు సర్వలోకమునకువెళ్ళి, సర్వసృష్టికి సువార్త ప్రకటించుమని, (శ్రీ) యేసు చెప్పిన చివరి యాజ్ఞను, నీవును నెరవేర్చి దాని ఫలితమును పొందుదువుగాక !

ప్రియసోదర, సోదరీయులారా ! మన జీవితము లెట్లున్నవి ? మన రాబడి యంతటిలోనుండి పదియవ వంతు తీసి, వెదజల్లి, దైవసేవచేయించి అభివృద్ధిపొందుచున్నామా ? లేక తగినదానికన్న తక్కువ యిచ్చి దైవాజ్ఞను నెరవేర్చలేక లేమిలో నున్నామా ఆలోచించుడి. "ఒకడు లోకమంతయు సంపాదించి, తన ప్రాణము పోగొట్టుకొంటె వానికేమి లాభము" గాన మనమును దైవాజ్ఞను నెరవేర్చి ఆయన మన కొరకు సిద్ధపరచిన పరలోక నివాసములలో చేరి మన తండ్రి యగు దేవునితోను, మన అన్నయగు క్రీస్తుతోను, ఆదరణకర్త యగు పరిశుద్ధాత్మతోను, పరిశుద్ధులతోను చేరి ఆనందించుదుముగాక. ఆమెన్.



# కీర్తన

పల్లవి - దశమభాగములెల్ల దేవునివి - ధారాళముగ నియ్యసమకూడుడీ - పశువులు
పైరులు దేవునివి - పసిడిలోహపు గనులు దేవునివి - భాగ్యభోగ్యములెల్ల
దేవునివి - భావించి కానుకలను నియ్యుడీ ||దశమ||

1. దేవునివి దొంగిలించెదరా - దేవదేవుని మోసపుచ్చెదరా -
భావించి మదినెంచి భయమునెంచి - ప్రార్థింపదలవంచి
ప్రభుభాగమున్ - దేవాలయంబును పూర్ణంబుగా -
దేదీప్యముగనుండ సమకూర్చుడి ||దశమ||

2. పరిశుద్ధ దేవునిమందిరము - పరిపూర్ణముగాను యోచిం
చుడీ - పరిశుద్ధభాగము విడదీయుడి - పాడిపంటలు నాస్తి
దేవునివి - పదియవభాగంబు దేవునిది - పరమాత్మ దీవెన
లను బొందుడీ ||దశమ||

3. ప్రథమ ఫలంబులు దేవునివి - విదితంబుగ నీయమది
నెంచుడీ - సదమల హృదయములను బొందియు - ప్రథమ
భాగములెల్ల విడదీసియు, ముదమున దేవుని కర్పించుడీ -
సదయ దీవెనలొందగ సమకూర్చుడీ ||దశమ||

4. ఆకసపువాకిండ్లను విప్పెదను - అధికకృపలను గుమ్మరించు
దును - మీ కష్టఫలములను దీవింతును - భీకరనాశంబు
దొలగింతును - మీ కానంద దేశమిత్తునని - శ్రీకరుండే
యెహోవ సెలవిచ్చెను ||దశమ||

5. దినభోజనం బిచ్చు దేవునిని - ఘనసౌఖ్యంబుల నిచ్చు
దేవునిని - వినయంబుతో మదిని ధ్యానించుచు - దినభోజ
నంబులను భాగించుచు - మానక [illegible] కర్పించుడీ -
ఘనసేవజయమొందు పని బూనుడీ ||దశమ||

